షష్టిపూర్తి మహోత్సవ సందర్భమున
మిత్రుఁడు మధురకవి శ్రీ నాళము కృష్ణరావునకు
అంకిత మీఁబడినది.

## కృతిసమర్పణము

శ్రీకరుణారససాంద్రా
లోకతరంగముల సాధులోకమ్ముఁ గోఱల్
లేకయ యనయమును మనుచు
నేకేశుఁడు కృష్ణకవికి నిడు శ్రేయమ్ముల్.

గరగర యాచు స్వీయజనకాండ మఖండము మోద మాత్మలం
బెరయఁగ మేలికీరుతుల పేరిటి వెన్నెలనిగ్గులం దెసల్
వరుసన నింపి మూఁడవ్వుకోల మ్మను మేల్రతనాలపంటఁ జం
దురుమురి పెమ్మ నోముకొన నూల్గొని పుట్టితి కృష్ణసాహ్వయా!

నాల మతిలోకవిభవకలాలసితత
రత్వదమలగుణగణవర్ణనవిధా వి
యత్త్వక్షత్రగవీస్ఫూర్తి రతులితశుభ
కీర్తిధారేయ నాలము కృష్ణరాయ !

కడఁగి స్థాపించితి గౌతమీపూర్వమ్ము
గ్రంథాలయ మొ్మండు గౌతమిదరి;
నడుము గట్టి శాలాన నడరించితి వినూత
నానుభావము సమసిక్రియానిరూఢిఁ;
బట్టితి పటువృత్తిఁ బాసి పేరికొమ్ము
లేకేశ్వరునిపాదకోకనదము
లం; దారి దీసితి లబ్ధసౌభ్రాతృత్వ
భావన మానవసేవ కీవ;

యక్షరాభ్యాస మొసఁగితి వల్లనాఁడు
నైచి ముందడుగు మహాత్మవర్త్మమందుఁ
బౌరులకు నెల్ల; నెల్ల కావే రహించు
కృతులఁ దోడిలోకమునకుఁ గృష్ణరాయ!

హాళి శాలీనతా శాలితాలసితము
మధురమూలమ్ము కవికులమండనమ్ము
మృదుసుశీలాకరగ్రహమే గారమ్ము
కేవలమ్మె నీపేరిమి కృష్ణరాయ !

పాలమున్నీరు శ్రీలక్ష్మిలీలఁ బాళిఁ
గంటి కడుపార మా లక్ష్మికాంతమాఖ్య

ననుఁగు జెల్లెలి; నలువ పెం పలర నాపె
కచ్ఛపిం గొన్నదెపుడో వాగ్వనిత నొంచి.

ముద్దు, గోరుముద్దలు, వెన్నబుడగలు, విరి
దండలుం, బాలతరగలు, నిండుమీఁగ
డతరగలు బుట్టి మీఁదునింటన కొనిసవి
పేరిమి మధురగీతికాకారలబ్ధి.

అలఁతిం బోనిది భ్రాతృతాగరిమ, మవ్యాజమ్ము వాత్సల్య, మె
వ్వలనం గంటులు లేనినిండుమనమున్, స్ఫారప్రసారమ్ములున్,
వలిగో లాఁతుల కందఁబోనిఫలమ్మై నల్వారునీచెల్మిక
ల్మి లలిన్ మా కొడగూర్చి పేర్చె నిటు పేర్మిం బున్నె మేనాఁటిదో!

అది మన కొనగూడని య
ట్టిద యెటు కానోపు హృత్పుటిం గృష్ణశ్రీ
మృదుపదనిహితాదృతిసం
పదనూనుల మానకాదె మనయిరువురమున్.

కనుఁగో సర్వజనోపయోగకరముల్ గ్రంథమ్ములం గూర్చున
ప్పనిఁ బాల్గొంటి మొకండె లక్ష్యముగ, సంభావ్యస్థితిం గొంటి మం
టినవాసిం గృతు లిచ్చిపుచ్చుకొన నై నేఁ డిందుఁడుం దార లుం
డినయందాఁక సుహృత్త్వమున్ నెఱపు పాడిం గంటి మన్వర్థతన్.

గౌతమీతీరమా, పాతకోద్ధారమా,
సత్కవీణ్ణిరతసంచారమ యిది;
రాజమహేంద్రమా, ప్రాజ్యవైభవసాంద్ర
మా, యశోనిస్తంద్రమా, పుర మిది;
నాలమా, మధురతాంబూలమా, కవితాల
తాలవాలమ, శుభశీలమ యిది;
కృష్ణుఁడా, విగతార్థతృష్ణుఁడా, రుచిరవా
గ్రోచిష్ణుఁడా, పవిత్రుం డితండు;

సర్వసమ్మోదస్ఫూర్తియా, షష్టిపూర్తి
యా యిది మహోత్సవము గూర్చునలవు నోలసెఁ
గన్నుదోయి కీయదనున నన్నుఁ గన్న
కుట్టదే లాఁతియలఁతులకుం గరంబు.

కూడమో యొక్కెడం, జూడమో యెన లేని
జాడ నెసఁగుమహోత్సవము లెన్నొ,
వ్రాయమో పద్దెముల్, వేయమో మాలికల్
బాయనిపేర్మి గలమ్మునంను,
మించమో కెలసానఁ, బెంచమో యరుసమ్ము
నించు గారవమున నెమ్మనమునఁ,

గామో కృతార్థుల, మీమో నమస్కృతి
స్తోమ మీశున కార్థ యోముకొనఁగ,

నలరుటనో కృష్ణమూలకమై, యెఱుంగ
రాని మఱియొండుకతమునవో, నిరుపమ
ముత్సుకత్వము నెలయించునోలపు నాలసెఁ
బూజ్యుఁ డీ సుహృద్వయషష్టిపూర్తిమహము.

# ఏకేశ్వరా !

జగ మెల్లం బురురూపతాఘన! భవత్సచ్చిత్స్వరూపం బటం
చున్ గడున్ దూరమ యైప్రపంచగతికిన్ శోభిల్లునిష్కించనుల్
తగ నప్పాటిద బాట నీ కొసఁగునీధన్యాంఘ్రియుగ్మం బన
న్యగతిన్ నమ్మి భజించి యెద్ది యెది పొందన్ నేర రేకేశ్వరా!

అల గంధర్వపురోపమంబు లయి స్వప్నావస్థఁ గన్పట్టు తో
య్యాలిమేల్నెయ్యపుకౌఁగిలింతలకు నీడై బుద్బుదాభంబు లౌ
లలనాపత్యసుహృద్గృహాదులెడ సంలగ్నమ్ము చిత్తమ్ము నం,
దలక్రిందై విషయాబ్ధి బ్రుంగుజగమున్ బాలింపు మేకేశ్వరా !

తవులుం దాఁకు నెనాఁడు లేనితమి మత్తత్త్వంబు దీపింప ను
ద్దవిడిం దుర్విషయార్థపద్ధతుల మత్స్వాంత మ్మజస్రమ్ము వా
రువమై పేరెమువాఱుఁగాని భవదంఘ్రుల్ గొల్చుకర్జమ్మునన్
లవమంతేనిఁ బ్రవృత్తిఁ జూపఁ జన దేలా వేలిఁ కేకేశ్వరా !

నిగమాంతప్రతిపాదితశ్రవ! భవన్నిశ్శ్వాసభూతంబు లౌ
నిగమంబుల్ నిఖిలార్థసిద్ధికరునిన్ నిన్ నామరూపాదిదూ
రుఁ గనద్రూపవిభాసిఁగా నొడువు వైరుద్ధ్యంబు ప్రాపింపదో
మిగులం దాన నవాని కొండొరులకున్ మేఁ గొంచు నేకేశ్వరా !

చలనై సన్ననిగాడ్పులం బనుచుకాసారంబునీరంబులోఁ
గలనోత్తుంగతరంగభంగముల రాకాకైరవౌఘాప్తుఁడుం
బలె భాసిల్లుఁ దనూశతాంతరగతత్వప్రాప్తి నానాత్వసం
వలితుండై పరమాత్మ యొక్కరుఁడ సర్వవ్యాపి యేకేశ్వరా!

కడువేడ్కం దనచిన్నిముట్టె బహుదుగ్ధమ్మాతృస్తనోధస్సులో
నిడి తాఁ గ్రోలినపా లచేతనము లెంతే వత్ససంవృద్ధిక
ట్లడరుం దో డయి తత్తదాకృతికృతధ్యానప్రకారంబు నీ
యడఁగంబోసియుపాస్తి కస్తగుణ, మాయాదూర, యేకేశ్వరా!

హేయం బాత్మవిత స్తిస స్తకమితం బేనోబలా స్తంబు సా
పాయం బస్థిపురీషమాంసరుధిరవ్యాప్తంబు కాయంబుపై
మాయాభూతగృహీతులై పొదివి దుర్మానం బనూనంబు నా
నాయాసంబుల నొందుచుండ్రు నరు లిట్టట్టుచు నేకేశ్వరా!

ప్రకటావర్త ఘనాపగావనపరీవాహమ్ము వేగమ్మునై
నొకచోఁ జేరి క్రమక్రమమ్మున వియోగాప్తి నొప్పారువా

లుఁ గలట్టిల్ కృతకర్మక్లృప్తి సఖు లాలుం బిడ్డలుం బొందుచుం
ద్రు కనద్యోగవియోగముల్ ధనము దద్రూపంబ యేకేశ్వరా!

జలజాతాక్షులమూపుతూపులగమిన్ సంవిద్ధమై తద్ద చి
లులు వోవన్ నిజధైర్యకంచుకము గోడుం గుడ్వఁగా నొచు ని
చ్చలు నవ్వారిపదార్చనాభిరతి నష్టభ్రష్టులై కూలుదు
ర్త్యులకుం దారక మెన్న నీదుభజన మ్మొక్కండ యేకేశ్వరా!

వ్రతముల్ వేనకు వే లొనర్చి క్రతుచర్యాగ్నివార్యాదృతిం
క్రతుభుక్శ్రేణికి విందు వెట్టి, సుతపోరక్తిన్ మెయిన్ నొంచి యే
గతిఁ దా నొందఁగఁ గోరుభూరిఫలముం గాంచున్ నరుం డొక్కమా
రతినిష్ఠన్ భవదీయరూపము మదిన్ ధ్యానించి యేకేశ్వరా!

నినుఁ జిత్తమ్మున నమ్మి, వాక్కరణముల్ నీకూర్చుదాస్యమ్మునన్
వినియోగించి, ప్రణష్టదుష్టమలక్లృప్తిన్ యోగదగ్ధాంగుఁడై
తనరం బంజరము త్రెమ్మా పులుఁగుచందం బూర్ధ్వగామిత్వపా
వనుఁడై వాఁ డపునర్జనిప్రదము నీప్రాఁ పొందు నేకేశ్వరా!

సిసువుం జెక్కిలి మీటుచున్ జనని చన్ జేపారఁ ద్రావించుచో
ప్పెసఁగన్ నిగ్రహరూపమాకరుణఁ బాలింపన్ వ్రతం బూన నీ
వు సతంబున్, జడు లీ నరుల్ మహీరుహంబుం గొట్టి పైవేసికొం
చసమానంబు భవాబ్ధి మున్గఁ జనువా రస్తర్థి నేకేశ్వరా!

శ్రవణధ్యాననిషేవణస్తవనచంచద్భక్తిభావంబుఁ దేఁ
కువఁ జొచ్చో యనిపించి కర్మగతిఁ గొంకుం డొంకునుం గ్రుంకిపో
వ విముక్తత్వముఁ గాంచఁ పూనికి యవు నావన్ వీడి చేజేతఁ బో
క వెలం దూఁగని ప్రాఁతప్రుచ్చువదరుం గైకొంట యేకేశ్వరా!

చలదూర్మిద్వితయాంతరమ్మున నవస్థం జిక్కి పోనేఱ కె
వ్వాలనం దత్ప్రబలావఘాతముల నొవ్వన్ మే నచో నుండి వి
హ్వాలతం గూర్మ మొకప్డు సంకు గొని గ్రీవం జొన్ప తా నేఁగున
ట్టులు మర్త్యుండు వివేకి యౌఁ గడచి పుట్టుల్ కోటు లేకేశ్వరా!

పొడమం బోఁడిమి యెల్లప్రాణులపదంబుల్ హస్తిపాదంబులో
నడఁగన్ నేలుచుతీరు గూర నుఱుమాయల్ జ్ఞేయముల్ కాని క్రొ
న్నడలం బొల్చున వెల్ల సచ్చిదమలానందాత్మ! నీయంద యె
ప్డుదు నొప్పారు నడంగియుండి; త్రిజగత్పూజ్యాంఘ్రి! యేకేశ్వరా!

నానాద్వీపసరస్వదద్రిపురకాంతారాంకితత్వోల్లస
న్నానాలోకనికాయభారవహతుందభ్రాజమానున్ శుభా
ఖ్యానానంత్యపవిత్రు నిన్ బుధులు శాఖాచంద్రమోన్యాయసం
స్థానస్ఫూర్తి వచింత్రు కోశగతుఁగా సద్రూప యేకేశ్వరా!

ఓజస్తేజములం ద్యుతిం గొని యనుస్యూతత్వవిఖ్యాతిమైఁ
దా జాగ్రత్తున నిద్దురం గలల నొందం బోలికి భల్లాతకీ

బీజన్యాయ ముపాధితోడితవు లెవ్వేళన్ లవంబేని లే
కోఁజన్ రాజిలు నెవ్వఁడా ఘనుని నిన్నూహింతు నేకేశ్వరా!

అనుఘుస్రమ్మునఁ బయింబయిం దిరుగుచున్ జ్యాంతస్థితంబౌ హిర
ణ్యనిధానం బసమానముంబగిదిఁ బాయంబోక కాయంబునం
దుస నాత్మత్వనిరూఢి ప్రౌఢిఁ గన బుద్ధుల్ లెస్స ప్రేరేచుచున్
మనుని న్నెన్నఁడు నేఱ రే రెఱుఁగ శంభద్భావ, యేకేశ్వరా!

అల వాప్పారఁ దుషానిగూఢ మవ్వుబియ్యమ్మట్లు, ముంజాభిదా
కలితమ్మాత్మ తృణమందునుండియ యిషీకమ్మట్లు, యుక్తిప్రయు
క్తుల మేల్నేరిమిఁ గోశదేహగణమందుం బొల్చునిన్నున్ నిషద్
జ్ఞులు వెల్లేరిచి కొల్చువారు పరవస్తుస్ఫూర్తి నేకేశ్వరా!

# రా ధా మా ధ వ ము

## సంస్తుతి

క్రమ్మెఁ గాఱుమొయిళ్లు గవియుపేరిఱులతోఁ
గాటుక పూసినబాట బయలు,
నిగిడెఁ దమిస్ర, కానుఁగుచెట్లమఱుఁగుల
శ్యామలమ్ములు వనభూము లెల్లఁ,
జీమ జిటుకన్నఁ జిమ్మట జిట్టన్నఁ
గడు నులికిపడుఁ బసిగాయ, వీనిఁ
జెచ్చర నీ పిలుజేర్పుమా యనునంచు
నానన్మై నరిగి ప్రత్యధ్వశుంజ

భూరుహమ్ములఁ జిలివిలిపోవఁ బ్రవిమ
లానురాగానుభావమ్ము లతివివశులు
రాధికామాధవులయమునాధునీప్ర
పూతతటరహఃక్రీడ లేపునఁ దనర్చు.

అరయన్ సంసరణామయోపశమనమ్మై లెస్సయై నిచ్చక్రో
త్తరుచుల్ గొల్పుముకుందపాదవనజధ్యానామృతమ్మోలిఁ గ్రో
ల, రసస్యందికలావిలాసములజాడల్ జూడఁగాఁ గోరుచుం
దురయేనిన్ జయదేవసత్కవినోదుల్ తోరంబు లాలింపుఁడీ.

సిరిచన్గొండలు రెండు నిండుతమి నాశ్లేషించునప్పట్ల ని
ర్భరకాశ్మీరసమార్ద్రమై మెఱయుచున్ వ్యక్తానురాగమ్మటుల్
స్థిరమై ఖేలదసంగఖేదగలితస్వేదాంబుపూరంబు శ్రీ
హరివక్షమ్మునఁ గూర్చుఁగావుత సతమ్మస్మన్మనోభీష్టముల్.

# సామోదదామోదరము

తలిరుజిరావజీరుపలుతాపపుతూపుల కోడి వాడి వ
త్తలు నయి సోఁడుముల్ సడలి తక్కిరిబిక్కిరి యై వసంతమా
దలరులఁబోలుమేలవయవాళిఁ గళిందసుతాతటాటవిన్
వెలలి వ్రజప్రియున్ వెదకి వేసరు రాధ కనున్ వయస్యతోన్.

పరికింపంగదవే లవంగలతికావారమ్ముపైపైపరా
మరికం గోమలమున్ సుశీతలము శుంభద్గంధవాహంబు సం
బరమున్ సంభృతసంభ్రమమ్ము మెఱయన్ నైఁ జెమ్మటల్ వాప శ్రీ
హరి బృందాటవి నున్నవాఁ డిపుడు నృత్యవ్యగ్రుఁడై బోంట్లతోన్.

అలరుంబోఁడిరో! మాధవీలతలమధ్యం బొల్చి కీర్ణప్రణూ
త్నలతాంతమ్ములఁ గన్నువిందు లయి యున్నత్తద్విరేఫప్రియా
కలకంఠమ్ముల తేటపాటలకుఁ జక్కన్ మాఱు లీనోపుతీ
వలయుండ్లన్ విహరించుచుండు యువతీపంచాస్త్రుఁ డాతం డచోన్.

కుములుచుఫూవువింటిదొరకోల్తలకుఁ గురియైనపాంథవ
ర్గమునకు గుండెతల్లడము, కల్మషకోకిలపోతకూజితా
సమము, దురంత మీనవవసంతమునం దతఁ డుండు సుందరీ
స్తిమితకుచోపగూహనవిశేషము లబ్బెసియుంచు చయ్యెడన్.

అల వలరాజుపేరిటిధరాధిపుకాంచనదండదీప్తి శో
భిలునవకేసరప్రసవబృందవికాసమ యివ్వసంత మా
మిలితశిలీముఖప్రకరమేదురపాటలసూనకోటిసం
కలితసుమాస్త్రతూణ మయి క్రాలెడుఁ గంటె కురంగలోచనా!

స్మరుబాణం బడి యస్సు రుస్సు రనువిర్మందాత్ములన్ నవ్వె నా
విరియం బూచినపూలమ్రాఁకులఁ గడుం బెంపారునివ్వేళ తా
విరహిస్వాంతనికృంతనప్రవణ మాంభీలమ్ము కుంతమ్ముగా
ద్వరఁ బూవిల్తున కిచ్చుచున్నయది శుంభత్కేతకీసూనమున్.

విరిసినమేల్బండిగురివెందపూవుల
కమ్మపుప్పొడి దచ్చికడలఁ జల్లి,
మాలతీజాతులమధురమరందమ్ము
న మిలిందములకు బోనమ్ము వెట్టి,
చెలు వవులేమావిచివురుజొంపమ్ముల
బలులఁ గోయిలపిండ్లు బొట్లుగఁ గొని,

అటు పోటును లేని పోటుబంటుతనాన
విరహులపై దాడి వెడలి యోధులు

పిండియిడుదురంతవసంతవేళ సుమిత
శుభలతాశ్లేషపులకితచూతజాత
మైనబృందావనమున ననంగదేవు
కొలువునన్ సాంగనుఁడు వాఁడు కుదిరినాఁడు.

అరవిరిమల్లెపూగుములయుత్ప్రపుప్పొడిజల్లులన్ వనాం
తరములు వాసితమ్ములు పొనర్చుచుఁ గేతకగంధబంధుతా
స్థిరతరగంధవాహ మిటు చిత్తము నేర్వఁ గడంగె బేసివి
ద్ధారయుసుగళ్లు వెద్దవిలి; లోకము రోయద తత్ప్రతిక్రియన్!

అలివేణీ! మధుగంధలుబ్ధమధుపవ్యాధూతచూతాంకుర
ప్రబలత్కోకిలకాకలీకలరవాఽఽరంభోత్కర్ష జ్వర
మ్ములు నాళ్ళయ్యవి బాటసాళ్ల గడుపం బూనొవ్వరు ధ్యాసఫణా
స్త్రలతాంగీపరిరంభసంభృతమహాహర్షాసహాంబుమై నెట్టటో:

అనుచున్ నెచ్చెలి యూపెఁ గొంచుఁ జని బృందారణ్యమధ్యంబునం
దనుపౌ నొక్కఁడు మావిప్రూనిదరిఁ బంచాస్త్రాస్త్రముల్ మేలిజ
వ్వనులన్ వేవురఁ గూడి ప్రౌఢిమెయి దివ్యక్రీడలం దేలి తె
ప్పున నోలాడుముకుందుఁ జూపు చను నీపక్కిన్ రస మ్మొలకఁగాన్.

జలజాతాయతనేత్ర! కన్గొనితె, చంచత్ప్రావృషంభోధరం
బుల సోఁగా దనిపించు నల్లనిమెయిం బాల్పారుహారంబట్టును
వ్వాలువం బూని పటీరపంకవిలసద్వక్షంబునన్ నొక్కుచున్
లలనామండలి జారగోపకుఁడు లీలం బొల్చుచున్నాఁడదే.

చిలివిలివ్రొవఁ గోరికలు, చిత్తము నాత్మరతిం దలిర్ప, మేన్
బులకల నిండ, సంతసము పొంగఁగఁ జేడెలఁ గూడి పాడుచుం
బలుమఱు చిందుద్రొక్కువ్రజభాగ్యముసందెలచప్పుడుల్ కరం
బెలయుఁగఁ దాళమానము నటించుచునున్నవి కుండలమ్ములున్.

మేలిపసిండికుండలన మీఱుమెఱుంగులపొం గెసంగఁగా
వ్రాలనిగబ్బిగుబ్బలభరమ్మున వ్రాలి భుజమ్ముపైనిఁ బ
ద్మాలలనానివాసపదమానితవక్షునితో నదే వినీ
లాలక పాడుచున్నది పికాంగనలం బురుడించునెల్గునన్.

లలితవిలాసహాసరుచిలాలిత మోము విలోలలోచనో
త్పలదలఖేలనప్రభవపంచశరస్ఫురణమ్ము శౌరిశ్యా
మలము పదాంబుజమ్ము గని మానినవృత్తులతో నవానినిం
దలఁచుచు ముగ్ధ యోర్తు మది ధ్యానము సేయుచు నున్న దంగనా!

కనుగొమ్మెంతటినంగనాచియొకదా కంజాక్షి! తా నా నితం
బిని యేవేవొ రహస్యముల్ చెవిని విన్పింపంబలెన్ డాసి చి

కఱనిమేల్జన్ము లవాసిమే నోరసికోఁ గాంక్షించి నుజ్జెకిఱలిన్
మఃనిపంటం గడు నోకుఱచున్నయఁది మోముం గొంచుఁ గెంగేల్గవర్

అమరినవెల్లదామరలయందలిపుప్పొడులొప్పుజల్లులన్
గమగమలాడుదివ్యయమునాథునిలో సరిగంగలాడు సం
భ్రమ మొద నిండ నమ్మొలఁత మంజులవంజులకుంజమాధ్యగున్
రమణునిఁ బిల్చుచున్నయది రమ్మని గమ్మని వల్వ లాగుచున్.

కరతలతాళలోలమణికంకణనిక్వణనమ్ము స్వాధర
స్ఫురదమలానిలేరితము మోహనవంశమునారవమ్ములోఁ
దిరముగ నైక్యముం బొరయ నేర్పున నాడుచు మించుపంచమ
స్వరమున గానముం జలుపుభామిని మెచ్చెడు ప్రోడఁ జూడుమా.

పూని కుచోపగూహనవిమోహనవాగ్రచనేక్షణానుగా
నాననచుంబనానుసరణాదులనోర్తు మఱోర్తుకోర్తుగా
మానినులన్ సభాజితల మానుగఁ జేయుచు నింతఁ డంతఁడో
నానయగారిశౌరి కబలా! మనయూసు గ్రహించుపాటిదే!

# అక్లేశ కేశవము

ఆలీలన్ సకిపలుక్కు విన్కలిని ప్రత్యక్షంబుగా రాసలీ
లాలోలుండు ముకుందుకన్కలిని జాలన్ నిల్వునీకొంచు రా
ధాలోలాలక ప్రాంతకుంజగత యై తాపంబు దీపింప ని
ట్లాలావణ్యవతిన్ జెలిన్ గుఱిచి యీర్ష్యావేష్ట యై తా ననున్.

సరసతరసుధారసము బావి మోవితో
వేణు వూఁదుచు మనోవీథు లలరఁ,
గులుకుచూపులు వాఱఁ దల యూఁచునప్పట్లఁ
జెవిపూలు చెక్కిలిఁ జందు లిడఁగ,
వఱలి నట్టువ మాడు బర్హిబర్హమ్ముతో
మేలిఁజుంజురులు క్రొమ్మెఱుఁగు లీనఁ,
దొలిదిక్కు దొరవింటితోడి కాఱు మొయిళ్ళ
పస యే మనుగఱిమే నెసక మెసఁగ,

మెల్లఁ గనుఁ గప్పి కొని చన్నవల్లవాంగ
నలకఫుంగిళ్ళఁ దవిలి నాతలఁపు మాని
రాసలీలారసోల్లాసరతిఁ నెసంగు
మాయదారిని స్మరియించు మన్మనమ్ము.

పొసఁగం బూచినబంధూ
కసుమమ్మున కొలపు నేర్పఁ గలుగు పెదవుల౯
ముసిముసినగవులు తళుకుల
నిసిరింతలువాఱువాని నెటు మఱతుఁ జెలీ!

చేతమారఁ జివురుచేతుల వ్రేఁతల
నెల్లఁ గౌఁగిట గ్రుచ్చి యెత్తువాఁడు,
చిటిపొటిరవణాలచెలువంపునిగ్గుల
నిఱులక్రమ్మిక నెడలించువాఁడు,
మొయిళులమేల్నడఁ బొలుచుచందురు దూరు
మిసిమిగందపుబొట్టునొసలువాఁడు,
రారాపుగుబ్బలతాయిడిఁ గఱకుఁద
న మ్మెనసినపేరురమ్మువాఁడు,

డం బెసఁగుకుండలములగండంబువాఁడు,
పట్టుహొంబట్టుమొలకట్టుపంచెవాడు,

వలదొరన్ మించురూపమ్ము వాఁడు, వాఁడు
కన్నులన నిల్చి తఱలఁడో యన్న మిన్న!

కలికలుష మ్మొడలించుచు
నల తొల్లిటికడిమిచెంత కటు చని వలరా
ములుకుల గెలుచుకులుకుచూ
పుల నామదిఁ గొన్నవాఁడు పోవునె యెడమై!

సకి! నా యూసన రోసి యన్యవనితాసక్తాత్ముఁ డవ్వాని నో
పికఁ గాంక్షించుచుఁ దద్గుణప్రకరమున్ వేనోళ్ళఁ గీర్తించు చోం
డొకరవ్వంతయుఁ గినుకఁ బూనక ప్రమాదోద్ఘాటనానిష్టమై
ప్రకటామోదను నొందుచున్నయది మత్స్వాంతమ్ము నే మందునే!

పలుకుము నిమ్మెయి నయ్యు
త్పలలోచన దూతిరీతి భావించి చెలిన్
దల మునిఁగి తాఁడిపొడ్వై
నిలువర మిడఁ జననియరితి నెక్కొన ననియెన్.

చెలి! పలుకుపులుఁగు బాబా
ములుకుల కదవద యయి సెడి పోఁడిమి దరిదా
పాలయని మోహాంబుధి ము
నఁగలిడునను మనుపు మను చరికరుఁ గొనిరమ్మా.

ముగుదా! ము న్ననుకొన్నయట్ల నిశిఁ దా మున్మున్న నాకంటె న
చ్చుగఁ గుంజాంతరభూమి డాగినతఁ డచ్చో నేఁ బద మ్మూంచి చె
ల్వుఁగ నంబోమి వెలుం జికాకువడునాలో నవ్వుచున్ నన్ సుమా
శుగకేళీరతి డాసె, నాఁటికతయూసుం దెల్పుమా వానికిన్.

ప్రథమసమాగమ మ్మగుటఁ బాయనిసిగ్గున ముగ్ధి యెట్టిదో
వ్యథ గొనునన్ను చాటువచనావళి లోఁగొని మేను రాయుచున్
శిథిలము సేసి కోకముడి సేసిన యా నయగారిసేఁత ల
వ్విధము నాకింతగాఁ దలఁచి వెన్కటినేస్తము పూనఁ బల్కుమా.

తలిరులసెజ్జఁ జేరిచి ముదమ్మున నాదువెడందఱొమ్ముపైఁ
దల నిడి పండియున్నస్మరదర్పహు నాతనిఁ గౌఁగిలించి ము
ద్దులుగొనునన్ను మెచ్చు చెదఁ దోరపునవ్వులు మొలకెత్త న
య్యలఘుఁడు నాదుమోవిఁ దనివారఁగఁ గ్రోలె, నటుల్ దలంపఁడో!

చిలివిలిపోవఁ గోరికలు, చిత్తము నిల్వన నీరు కాఁ, దలం
పులు నిగుడ న్వడిం బొడమ ముత్పులకాంకురముల్, శ్రమాంబుసం
కలితశరీరనై నయనకంజము లల్లన మూసి తంత న
గ్గల మయి మారుగోరపువికారము లోలత నొందె నాతఁడున్.

కోకిలకలరవకూజితోల్లసితంబు,
లీలారసోల్లాసలాలితంబు,

సంభృతరోమాంచసంచయసరసంబు,
స్మరకలావ్యాక్రియాపరిణతంబు,
శ్లథకుసుమాకులచలకుంతలభరంబు,
నఖలిఖితఘనస్తనద్వయంబు,
చరణరణన్మణిచారునూపురకంబు,
పూరితరతిబంధపుంజితంబు,

స్రస్తమేఖలమును, సకచగ్రహాప్ర
దత్తచుంబన, మాపాదితసుఖపరవ
శత్వ, మానాఁటియాకేళిఁ జక్క నాడివి
వానిఁ గొని తెమ్ము, పున్నెపుబాటఁ బొమ్ము.

నీకును నాకు నెల్లరకు నేర్పునఁ గాటుక వైచి కంటఁ బల్
పోఁకలుపోవువాఁ డరిగి పోయినపోఁకగ వారితోడిదే
లోక మటంచు వగ్గిలెడి లోచనచిహ్నిత మంజనమ్ముతో
నాకడ, నాకతన్ నాడివి యాతనిఁ దోడ్కొని రమ్ము కొమ్మరో!

సకి! యాభీరవధూవృతుం డతనిహస్తస్రస్తమై వేణు వూ
ఱక నేలం బడె, గండపాళి దిగఁగా ఱంజొచ్చెఁ గ్రొంజెమ్మటల్;
వికలం బయ్యె మనంబు; నానఁ గొని మేల్నెమ్మోము క్రిందయ్యె; రా
సకలాలోలతఁ బొల్చుచున్నతఱిఁ బెల్చన్ నన్ను గన్నంతనే.

కనుఁగోరానియలంతిమంజరులఁ జోకటమ్మానశోకప్రతా
నిని నూఁగాడ్చుసరోవరోపవనమందీభూతవాతమ్ము, నో
య్యన భ్రామ్యద్భ్రమరాంగనారణితరమ్యాగ్రంబులై పొట్టఁ గ
ట్టినమాకందపుమొగ్గలుం జివురుబోఁడీ! కావు మత్ప్రీతికిన్.

వినుమా యిటు, పటురయమునఁ
జనుమా, తూ చా త్యజింపఁ జన కాతనితో
ననుమా నాగోడవలకతఁ,
గొనుమా పున్నెమ్ము వానిఁ గొనిచనుదెమ్మా.

## ముగ్ధమధుసూదనము

పొగిలి తనయున్న యునికికి మిగుల వగల
నటులు మార్మ్రోగ మిడి చన్నయబ్జవదన
ప్రబలసంసారశృంఖల రాధ నెంచి
తప్తుఁ డవుచు నంతంత వ్రేఁతలఁ ద్యజించి,

అంమును నింపు రోసి కన కన్గుచెలిం బువువిల్తుకో ల్తలం
గందనగాయ గాయ మయి కాటియవెట్ట, వియోగతాప మే
పొందుడు వల్లవీప్రియుఁడు నొకఁడు కుంజమునం జివుళ్ళసె
జ్జం దల వాంచి పండి పలుచాయల వందుర సాఁగె నీగతిన్.

వ్రజచంద్రాస్యలఁ గూడిమాడి యతిపార ప్రేమ్నసమోదానఁ గా
యజకేళీపరతంత్రతం బరఁగున న్నంతంత నీక్షించి య
లఁ జల మ్మేలఁగఁ గ్రమ్మఱం జనిన దా లావణ్యవారాశి, తె
ల్పఁ జనుల్ జికఁనివుబ్బుచున్ సడలుచున్ శ్వాసోగ్రతన్ రోసమున్.

ఆసుమకోమలాంగి చను టట్టులు నాయము, లాఁతినాతిపై
నాసమెయిన్ మరుల్ గొనినయట్టిమనోవిభు మెచ్చువారె సా
ధ్వీసుదతీమతల్లులు, పదింబది భీతిలి సాపరాధతన్
గాసుకు వచ్చునంతయినఁ గా దని యడ్డకపోతి నకటా!

నాయెడబాటుకల్మి విపినంబున నేపౌదరింటిలోనో సా
పాయఁగలిన్ స్మరగ్రహమువాతఁ గుమారిలుచుండుఁగాని యి
ష్టాయమలాంగి, చేయు నెది, యాఁడు నిఁ కేనుడు, లేరి దూఱు, నే
లా యుసు ఇల్లు వాఁకిలియు నాప్తు లయుక్తుఁడ నాకు నిత్తఱిన్?

వడివడి పైఁబయిన్ రొదలు వెట్టుచుఁ జుట్టు భ్రమించు తేటివం
గడపుడుఁ నీని సేఁతలఁ గ కావికలా నెఱదమ్మిపూవటుల్
చిడిముడిపాటునం బొమముడిం గలుషించుచుఁ జేవురైనయ
ప్పుడఁటి మొగమ్ము కన్నులన పాతరలాడుచు నున్న దెన్ననై.

ఏలా వేలు ప్రయత్నముల్ సెలఁగ నే నిం దంను మందుండ నై
జాలిన్ రోసి వృథాప్రయాసవివశస్వాంతంబునం దూలిపోఁ,
బాలుం గాఱు మొగమ్ముతో హృదయబింబంబందు దీపించున
య్యాలోలాలకతో రమింపనవు భాగ్యం బందుటే లెస్స సూ.

తెలియ వాక యంచుకించుక
చల, మీనాఁ డగ్గలమ్ము చల మను పదనౌ

ముఁలికికొన నాటి నీహ్వా
త్ఫలకము గాయపడినదోకో తనుతరగాత్రీ!

తల మునిఁగి తాడిపొడవుగ
నోలసినపేరలుక నేఁగితో యాడుభుజం
గిలలిఁ రోజుచు నెటకుం!
జలకుంతల! మ్రొక్కువాఁడ క్షమియింపఁగదే.

ఏలా గతాగతమ్ముల
యీలీలం దవిలి సేయ నీక్షణయుగికిఁ
బాళి మెయి నగ్గ మయ్యుం?
బోలదె పరిరంభ మొసగ మును పెటు లట్టుల్!

ఒక్కఁడు రెండు మూఁడు మఱియొక్కఁడుమా ఱిదె ధేనువాన నే
నెక్కటి నాకి నిక్కమ వచింపుచునుంటిఁ బొనర్ప ముం దెనాఁ
డిక్కరణిం దలిర్చుదొసఁగే, వెడవింటిదునీనిచేతిఁలోఁ
జిక్కి కృశించున న్నధరసీధువుఁ ద్రావఁగ నిచ్చి ప్రోవవే.

అనుచుం దసమట్టునకుం
దనకుఁ మితిఁ దప్పి తప్పిదారినయోఁ బా
యని రాధావిరహావ్యథ
నణఁగుచు ననవిలుతుగుఱిచి యను నతఁ డిమ్మై.

కాదు కా దిది భుజంగమతారహారంబు,
తామరతూఁడులదండగాని;
కాదు కా దిది ఘోరకాలకూటముమచ్చ,
నలగల్వరేకులవెలుఁగుగాని;
కాదు కా దిది గరగరలాడుబుసుమమ్మ,
పూసినగందపుఁబోడియొకాని;
కాదు కా దిది సుధాకరుపదాఱవరేక,
వెలితమ్మిపూతొలిదలముగాని;

కాను నే హరుండఁ; గడుఁ బొరపడినాఁడ
వో స్మరుండ! కోప మూని యుఱక
కాలు ద్రవ్వ దేల కయ్యాల కీలిల?
రాధఁ బాసి పొగులు మాధవుండ.

కోసఁగాఁబోకుమ చూతసాయకము, నెక్కుఁబెట్టఁగా మానుమా
ధనువున్, నిర్జితవిశ్వ! మూర్ఛితనృఘాతంబున్ మహాపౌరుషం
బె? నిజం బాహరిణాంగనాదృగతనుప్రేంఖత్కటాక్షాశుగ
ప్రణీతం బైనమనంబు బాయ దిపుడున్ వంతన్ రవంతేనియున్.

వెలయునివ్వుళ్ళఁ బోల్బొమలు విల్లు, నపాంగతరంగితమ్ములే
ములుకులు, కర్ణపాళి గుణముఖ్యముగా రచియించి యుంచెనో

చల మెసఁగన్ స్వదిగ్విజయజంగమ దేవత రాధయందుఁ బూ
విలుతుఁడు లోకపాళి నొక పెట్టున లోఁగొనఁ జాలుజాలునన్.

నిర్మించుఁబో ఘోరమర్మవ్యథం గను
బొమలపేరిటిధనువున నమర్పఁ
గాఁబడినదృగాశుగము; శ్యామరూపమ్ము
కుటిలమ్ము నెఱికొప్పుకూర్పుఁగాక
మారోద్యమమున కేమఱ కర్థసంసిద్ధి;
రాగపూర్ణము సుధారసము బావి
కెమ్మోవి నెమ్మది నెమ్మది వలపుతీ
వియ లగ్గలమ్ముగఁ బెనుచుఁగాక;

తన్వి! సద్వృత్త ముత్తమోత్తమము నీదు
తోరమౌ గబ్బిగుబ్బలదోయితో ర
మించుచున్నది మత్ప్రాణపంచకమ్ము
మఱలు మన్న ననేమిరా మఱల నను.

ఆలావణ్యము, బెళుకుఁజూపులమెఱుం, గామోముగో, మావచో
లాలిత్యంబుఁ, జొక్కాటపుంజనులమేలౌఁకఁగిళ్లు, నా చెకుటద్దాలుం, గమ్మనిమోవి, సోఁకుసుక, మాత్మం దెల్సి యేకాగ్రతం
జాలం గొన్న వియోగరోగ మిఁకు పుష్ట మ్మోఁచు నన్ గ్రాఁచెడున్.

# స్నిగ్ధ మధుసూదనము

అని యోర్చుపరువుదప్పిన
ననవిలుతు వెతఁ దవిలి జమునదరిఁ **వానీ**
రనికుంజమ్మున వేదనఁ
జెనయునవాని కను రాధచెలి యోర్తు కిటుల్.

శ్యామసుందర! సుమకోమలాంగి మాయ
నుంగునెచ్చెలి రాధ కనుఁగవ నుఱలు
నీటిధారలె లేకున్న నీవియోగ
వహ్ని నీపాటి కపుడె మే న్వాయునదియ.

కంటె, తుంటరి యా వెడవింటివాని
కఱకుపువ్వుటమ్ములకు వెఱచఱచి పఱచి
కాలు నిలువకాకో యాకె క్రన్న డాగి
యడలుచున్నది నీహృద్గుహాంతరమున.

పురుషసింహా! యిత్తఱి గందవాడికి సమృత
కరుణకరముల కామెకుం గానివావి;
విషధరావాససంగతి విసముపోలె
నరయుచున్నది మలయానిలాంకురమ్ము.

బలసినమచ్చరమ్ము మెయిఁ బలుక్కలపుల్గుహుమాయిజోదు ని
ష్పాలరవల౯ వెలార్చువిరిముక్కలు కుప్పనగూర లేయఁ దాఁ
గలఁగి కందుగడు౯ హృదయగహ్వరగు౯ నిను గాఁచికో లలిం
గలువలరేకులన్ బడఁతి కప్పుచునున్నది మేలివచ్చము౯.

అలరులబోఁడి రాధ హృదయాంతరమందు మఖ్ఖొందుకోరికిం
జెలఁగక నీస్వయంగ్రహావిశేషసుఖానుభవమ్మునిచ్చ హె
చ్చ లలి మహావ్రతమ్మటులు సర్వకలాకమనీయమైన మే
లలరులపాన్పుపైఁ బడక నట్టె పొనర్చుచు నున్న దచ్యుతా!

వలితవిలోచనాంబుధరభాసురమై తవు మోము నెయ్యపుం
జెలి నెఱిమోముతమ్మి సరసీరుహలోచన! రాహుదంతపం
క్తుల విదలింపఁగాఁబడి యకుంఠసుధారసపూరధారలన్
విలసిలుపూర్ణచంద్రమసుబింబముడంబము దాల్చె నిత్తఱిన్.

నలిఁ బాదరింట నొక్కకెలనన్ సురహాస్యముగా వయస్య నిన్
వలపులయేలికన్ మొసలివార్వముపై నలువారువానిఁగా

నలవుమెయిన్ రచించి కరమందు నమర్చుచు లేఁతమావియా
కులములుకుల్ సమస్త్రియలకుప్పలు గూర్చుచునున్నదా పెయిన్.

అమలులు మానిచంద్రులకె ధ్యానపథమ్మున గోచరించుచం
డముఁ గొనఁబోనినిన్నుఁ బురతఃస్థితుఁగా మది నెంచి మించుతా
పమున మునుంగు, నవ్వు, నెడబాయనిచింత సగమ్మగున్, విలా
పము పొసరించు, నొండుదెసఁ బర్విడు, నూఱటనొందు, రాధ తాన్.

'ఓకంజాతదళాక్షు! నీయడుగు లెంతో నమ్మి నీతోడిదే
లోకమ్మంచుఁ దలంచుదాన నను మేలుం గా దుపేక్షింపఁగా,
రాకాబ్జాతుఁడు నీమెడమ్ము గొని గాత్ర మ్మేర్చుచున్నాఁ డికన్
సాఁకన్ రాఁగదే'యంచు మాదుచెలి నిచ్చల్ మ్రొక్కుచుండున్ హరీ!

వేయేల? శ్రీలోల! పాయనినీయెడ
బాటున వన మయ్యె వాసభూమి;
కంటికి ఱెప్పలై కాఁచు నెచ్చెలు లెల్ల
రెడ యీనివలలుగా నేరుపడిరి;
నిగిడి నిట్టలమైననిట్టూర్పువేడిమి
యూఱనికార్చిచ్చుహారువుఁ బోరసె;
నభము శుభ మెఱుంగ దకట! మా నెచ్చెలి
బెదరి యదరు లేడిపిల్ల యయ్యె;

మివులఁ జలపాది లేమావిచివురుతూపు
లాఁడు కటికికిరాతుఁడై లావు వెంచి
సీసపుంబోఁతచెఱకువి ల్లెతఁ బూని
కాలు ద్రొక్కుచునున్నాఁడు కాలుఁడట్లు.

కడు వాడి వత్తలై బిగి
సడల బడలి నీవియోగసమయమ్మునఁ జే
డ్పడుమారాధిక కుచముల
నిడుముత్తైపుసరముసయిత మొంచు భరముగన్.

పూనుచున్నది శ్వసితానిల మ్మెటులో స
దాహమ్ము మనసిజదహనమటులు,
వైచుచున్నది యెల్లవలఁకుల నీర్గాఱు
కను కాడ వోయినకలువలలిని,
దిలకించుచున్నది తలిరుటాకులపాన్పుఁ
జింతబొగ్గులనిప్పుచేర్పు వోలె;
వీడకున్నది సంజవేళ సలోలేందుఁ
బోలు చెక్కిలిని గెంగేల సుంత

దుస్సహావియోగరోగానఁ దూలి మిత్తి
యుఱక నడునెత్తి నటియించుచున్నజాడ

నోట నను హరి హరి యనుమాట కున్నె
విధి విరామమ్ము హరి! రాధ వెతలు వింటె!

తొడుగుం బులకల, నస్సురుస్సు రను, నేదో వల్కు లోలోఁ, గడున్
వడఁకున్, గ్రుమ్మరు, సంస్మరించు, నయనాబ్జాతమ్ములన్ మూయుఁ దాఁ
బడు, లేచున్, దుది మూర్ఛిలున్, ముగుద దుర్వార మ్మనంగజ్వర
మ్ముదుకం జేఁత; నొసంగవే రసము నీ వాకింత దస్రోపమా!

మదనమహాజ్వరమ్ము పరిమాణము లేనిద యౌచు నేఁచఁగా
నదవదమ్మై త్వదీయమృదులాంగసుసంగసుధానుసాధ్య మౌ
నదనున నున్న యాయమ దయామతి నోమవయే నుపేంద్ర! నీ
హృదయము దారుణమ్ము నిజ మింద్రునివజ్రముధారకంటెఁ జూ.

అల మారజ్వరసంజ్వరాకులిత యాసత్తన్వి మార్మాఱు మూ
ర్ఛిలుచుం జందనచంద్రమఃకమలినీచింతాదురంతస్థితిన్
దలకున్ మీఁటినక్లాంతిఁ జల్లనినున్ ధ్యానించి ధ్యానించి యె
ట్టులో ప్రాణానిల మూనుచున్నయది రట్టుం బాపవే మాపతీ!

మిగుల విలోలలోచననిమీలనఖిన్నతఁ గుంది వంది యున్
సగ మయి నీయెడమ్ము నిముసమ్మును నోర్వనిరాధ నేఁడు తె
స్సగ దిగఁబూచి కోయిలలజాతికి విందులు వెట్టి నిల్వనన్
నెగడెడుతీయమావిఁ గని నేత్రయుగిం దను వెట్లు దాల్చెడున్?

# సాకాంక్ష పుండరీకాక్షము

అనుడుఁ గలంతఁ గొన్నహృదయమ్మున సమ్మధుసూదనుండు నో
నెలఁత! రయమ్మ నీ వరిగి నెచ్చెలిఁ దోడ్కొని రమ్ము, నమ్మఁగాఁ
బలుకు మిచోట నే నిలుచువాఁడఁ దొలంగక యన్నయంతలో
పలన పరుఁగు వాఱఁ జని ప్రాణవయస్యకు నాపె యిట్లనున్.

అనుఁగుంబోల్తులఁ బాసి గాసిలి కరం బట్టెట్టు లౌవారికం
దనగాయల్ దఱుగంగఁ నా విరిసి విన్నాణెమ్ములై పూవు లి
మ్మెనయం, జల్లనిపిల్లగాడ్పు లతనుం డీ సాయముం బాఱుచుం
డ సచోఁ గుందుచున్నవాఁడు హరి కాంతా! నీ వియోగార్తిమై.

లలి నేర్వఁ దొడర మైఁ జలువచేతులవాఁడు
మిత్తి డాసిసజాడఁ దత్తరిల్లుఁ;
గుప్పనగూరలై పుప్పొలతూపులు
పయిఁ బడ నడలు విహ్వలత గదురఁ;

గ్రొందేనియల్ గ్రోలి గ్రొవ్విన గ్రొందేంట్ల
జిలిబిలిపాటలుఁ జెవులు మూయుఁ;
గలఁకవాఱుడు వియోగముగోగ మ దోకందు
రీతితాపము నొందు రేయియెల్ల;

విడచి యిల్లు వాఁకిలి యెల్లవేళల విపి
నమ్ములం గ్రుమ్మరుచుఁ; దూళి దుమ్ము ననక
కటికినేలఁ బరుండు నెక్కటి; విసువక
నంజు నీదుపేరిటికూర నాతి! యతఁడు.

కోయిలజంటలకు పలుకుపలుధ్వనులకు
నులికి పేరెముపాఱుఁ గెలఁకులందు;
నది గని యెవ్వరే నపహసించిన నిహా
కిముపి నాస్తి యటంచుఁ గించ దాఁచుఁ;
గలరవమ్ములమేలికలరవమ్ములు మణి
తమ్ముల యని చెవుల్ దార్చి వినును;
నీకూర్చురతముల నెఱజాణతనమును
గొనియాడు వేనోళ్ళఁ దనివుపడక;

వినిన నీపేరినెలపేరు తనువు పొంగి
సిగ్గుఁడుం బూరఁడై సంతసించుచుఁ జ

పించు సరసత సద్దియు; పెరయఁగఁబోఁడు
జవ్వనులయందు రతి వాఁడు చానమిన్న!

చెలి! నిన్ గూడి తొలిన్ రతిక్రియలసంసిద్ధుల్ దమిం గొన్నని
ర్మల మా కుంజమనోజతీర్థమున మాంర్మాత్మున్ భవద్ధ్యాసని
శ్చలుఁడై నీబిగికౌఁగిటన్ మెలఁగునాసన్ శ్రీనివాసుండు ము
త్పులకల్ నిండ భవద్వచోమనుజపమ్మున్ జల్పుచున్నాఁడదే

ఓనితంబిని! మలయానిలుపోఁకల
నెఱి సెడి యమునాధునీతటమున
రతిసుఖసారమ్ము రమణీయ మలనాఁటి
యభిసారవరమునయందు వల్ల
వాంగనాజనసముత్తుంగఘనస్తనో
న్మర్దసలోలతమమ్ములు కర
పల్లవమ్ములు దేలవైచి త్రిప్పుచు వెఱ్ఱి
పోలికఁ గ్రుమ్మఱుసాలతాంత

శరమనోహరు, జలధరశ్యాము, భీక
రవిరహగ్రహోగ్రహామహారంభవివశు,
భవదధీనాత్ముఁ జేరుపని విను మింకఁ
బఱుగున విషమాస్త్రుఁడు కడు మొఱటువాఁడు.

చెలి! వింటే, విరహారుజా
చలితుండై పేరు వెట్టి సంకేతమ్ముం
దెలియం బలుకుచు నావాఁ
డలవునఁ బూరించు వేణువమలము రవళిన్.

లేమా! పలుమఱు నిఁక నీ
కేమని వచియింతు నీపయికరువలి నభ
స్సీమ కెగురు రేణువునుం
గోమలి! యాతండు పెద్దకొండగఁ దలఁచున్.

చీమ చిటుకురన్నఁ జిమ్మట జిట్టన్న
నాకు నలముఁ గదలి యలికిడయినఁ
జక్కఁ దిద్ది సెజ్జఁ జకితాత్ముఁడై నీదు
త్రోవ లరయు నతఁడు దోడుగునాస.

జలజాస్యా! స్మరకేళులన్ మెఱసి రచ్చంబెట్టునీజిల్గుటం
బెల దాయంబలెఁ ద్రోసిపుచ్చి, మఱుఁగై సిండారునీలద్యుతిం
బొలుపౌ మేలినిచోళమందు, వడి నంభోజాంబకుం డాతఁడు
న్నలతాకుంజముఁ జేరఁగా నరుగుమా నాథార్తి నూహింపుమా.

మెలఁతా! మేల్మిపసిండి నవ్వనపు నెమ్మే నిమ్ముగా నీవు చం
చలముక్తామణిహార మయ్యుపరతిన్ జక్కన్ విరాజిల్లఁగాఁ

గల వా కృష్ణునురమ్మునం జలబలాకమ్ముల్ సవమ్ముల్ రసో
జ్జ్వలమా నంబుదమందుఁ గ్రొమ్మెఱుఁగుతీవంబోలి లోలాలకా!

చిరిగినసిగ్గు లగ్గలపుచెల్వము గూర్పఁగఁ జీరపొత్తు మే
ల్గరగర యాచుఁ బాసి సుమకార్ముకునాఱవతూపు నా విలా
సరమ నెసంగఁ నంగ మరుసమ్మసిధానమటుల్ జివుళ్ళసె
జ్జ రమణి! వ్రాల్చు మావలివిచారము శౌరియ సేయువాఁడొగిన్.

హరి యభిమానమానితుఁ డటంచు నెఱింగినదానవేరదే,
హరిణవిలోలలోచన! త్రియామయుఁ దాఁ గడ ముట్ట నున్న దీ
హరువున నాలసింపఁదగవా? పగవాఁ డసమాస్త్రికోత్రలన్
హర! హర! జగ్గువగ్గులవునాతని కూఁతగ వేగ మేఁగవా?

పువువిల్లోపటరిగాము వాత నఱి యోర్పుల్ వేడినిట్టూర్పులన్
మివులం బుచ్చును; బల్మిఱుం గెలఁకుల న్నేత్రాబ్జముల్ వైచుఁ, జో
చ్చు వెసం గుంజమును, నిల్వనీ రవు, సమర్చున్ జకర బూసెజ్జ, నే
పవ్వవైకల్యమునం జికాకువడుఁ బ్రోయాలా! ప్రియుం డాయెడన్.

వెలఁదీ! నీప్రతిభాషతోడ నపరాబ్ధిం గ్రుంకె భానుండు; నీ
చెలువుం గ్రమ్మినపేరుకోరుకుల హెచ్చున్ జీఁకటుల్ సాంద్రతన్;
గలిపెం గోకకలారవమ్ములతో దీర్ఘంబుల్ మదభ్యర్థనం
బులు వావిన్; దడ వేల? వేల యిది చెల్వం జేరఁ గ్రాల్గంట్లకున్.

'పరువారం జనుదెంచుఁ, గాంచు నిట నా వామాంగి నన్, దెల్పుబో స్మరుగాథల్, గొను సంతసంబు పరిరంభప్రక్రియన్, గూటమిన్ వెరవుం జూపు' నటంచు నెంచుచుఁ దమోఽవేలమ్ము వల్లీగృహాం తరమం దొందుచునున్న వాఁడతఁడు వంతల్ చాన! ప్రాణాంతముల్.

ప్రణయపరీరంభపాండితీసందర్శ
        నంబులఁ, దీఱనిచుంబనముల,
నఖరద్విజోల్లేఖనప్రక్రియావ్యక్తి
        యలఁ, జిలివిలివోవుకులుకుదముల,
ముత్పులకాంకురోద్భేదల, సంభృత
        సంరంభముల, స్మరసంగరములఁ,
బ్రోఁడలై యరుసమ్ము నొరయుచుఁ గూరుచు
        వారికై చని తప్పిదారి దారిఁ

దారి కలిసి పలుకుతీరుల నొండొరు
గుత్తెఱింగికొన్న కూర్చునాలు
మగలప్రీడతోడ మిగుల దట్టమ్ము లీ
యిఱుల నెసక మెసఁగ దేరసమ్ము?

వినితే, భీతకురంగలోచన! దిశావీథిన్ నెఱన్ మీఱి కూ
రినయున్నిత్తరిచూపులం బఱపు చుర్వీజవ్రజచ్ఛాయలం

దు నొగిన్ నిల్చుచు మెల్లమెల్లసడలన్ నూల్కొన్నకందర్పవే
దనమై డాసిననిన్నుఁ గూడి కొను సార్థక్య ప్మ్రతం డీనిసిన్.

అనుడు మనోవిభుం డెసయునగ్గల మంగభవార్తి పీనులన్
వినభరియింప నోప రతివేపథువిహ్వల రాగపూర్ణ రా
ధ సట నికుంజమందమన ధైర్యమునుం బురికొల్పుచున్ వడిం
బనివిని శ్యామసుందరునిపాలికి నెచ్చెలి వలుకె నీలలిన్.

నాథహరీ! వినుమా మన
రాధ పొగులుచున్న దిపుడు రతిపతితాపో
ద్బాధిత యై పొదరింట వ
రాధరమధుపాననిరతు నరయుచు నిన్నున్.

ముసురుకొను తాపభరమున
నసురుసురై యుండియుం ద్వదభిసరణరసం
బెసఁగ నిడి కొన్నియడుగులు
వెసఁ గూలుచు నున్న దాపె పృథివి మధురిపూ!

ఎడ యీక యొడలు నిండం
దొడి తామరతూండ్లు పూలు దొడిఁబడు చరితిన్
విడ కూనుచున్న దుసు ఆ
ప్పడఁతుక త్వద్రసమునాస బలుపేని హరీ!

కొనకొని పల్లవులు గనుఁగొను
చనువుగఁ గయిసేసికొన్న యమలమణీమం
డనమండల మవ్విరహిణి
మనసుపసం దొలఁగి నేన మాధవుఁడ ననున్.

'మెలఁతా! మును తాఁబలికిన
మెలపున రాఁడేల యింక మృగమద లేపా
కలితుఁ డతఁడు సంకేత
స్థలి' కని సఖి నడుగు రాధ చాల వివశయై.

కటి వేలుప! యారాధిక
తెఱఁ గిఁక నేమందు! మొయిలు తెరువున దెసలన్
నెఱి మీఱి కవియుదట్టపు
టెఱులన్ ముద్దుగొను గాఁగిలించుఁ ద్వదూహన్.

జిలుగు రతనాలరవణ
మ్ము లొడల్ మెఱయఁగ ధరించి మీనాంకుని కే
ళుల కాయత్తముపడి నీ
విలంబనము సైప కాపె విలపించు హరీ!

జలదాభాపఘనా! మెయిం బులక లెచ్చన్ సీత్కృతిస్ఫూర్తి నా
కులయై యాంతరకోపకాకువులఁ బల్కున్, బూవువిల్కానికో

ల్తలకుం దత్తరమందు, ధ్యాసకలనా ప్తత్వాత్సమీపాధ్య యా
లలనారత్నము మున్గితేలు నటఁ బల్మ్రొయుర్ రసాంభోనిధిర్.

తోడవుల్ బల్మ్రొయుఁ దోడ్గు మేనఁ గను నీత్రోవల్ గనుల్ విప్పి చ
ప్పుడు లేచొప్పున నైనఁ, దా నమరుచుం బూసెజ్జ, యీరీతులం
బడి యాకల్పవికల్పతల్పరచనావ్యాపారమం దీనిసిం
గడుపర్ నేఁటిచుపాటి దప్పి మడుగంగా నున్న దా రాధయుర్.

# నాగరనారాయణము

పొలుపుం గూరిచె నష్ఠపు దిక్కులనుపూవుంబోంట్లనెమ్మోముల౯
నలువౌ గంధపుబొట్టు చందురుఁడు విన్నాణెంపుక్రొమ్మొగ్గ ల
గ్గలముల్ గాఁ గులటాధ్వపాతభవదుష్పాకలుష్యమో నా మెయి౯
నలడా లాఱనితీరుస౯ మెఱయ బృందాకాననక్షోణికి౯.

అనుఁగుచెలువునిరామితో నప్పలువల
దొరమెఱుంగులు ప్రస్ఫుటసరణిఁ బొరయ
సొరిది దరికొన్నవిరహాగ్ని చూరు మిగిలి
విధుర యై రాధ వగచె నివ్విధిఁ గరంబు.

అడవిం గాచినవెన్నెలై చెడిమోఁబో యచ్చంపునాజవ్వనం,
బడరం బ్రేమ మవాఁడు రాఁడిటకు నొయ్యం, బ్రోక్త మవ్వేలయుం
గడచె౯, రూప మరూప మాయుసుఱు నింకం గాల్పనే! నమ్మి యి
ట్లుసుఃగంగావలసె౯ సఖీవచన మియ్యుగ్రాటవీసీమలో౯.

అడవడనై విరహవ్యథఁ
గుదురక పద మచట నిచటకుఁ వచ్చి యతం
డదయుఁడు గనరామి నడలు
చెదఁ ద్రోపనఁగొఱవి నయితి నెటు బోదు నీఁకన్!

మీఁదర్ వియోగసాగర
మీఁదంజాలుపని తలకు నీఁక మీఱినయ
ద్దీఁదాఁ డన్నం గ్రన్నం
గోఁదాఁ డనువాఁడు వాఁడు, కూడు సుగ మెటుల్?

కను లొక వేయిగాఁ గుసుమకాండకిరాతుని బారి లేడిపి
ల్లన యయి పాదు గాన కొకెడం బద మీఁగహనాంతరమ్మునం
దనకయి పర్వువాఱి నిసి నాల్గువలంకుల జాలి రోయునా
మన మతగాని సేఁత సుమమార్గణమార్గణవిద్ధ మయ్యెఁగా!

కృష్ణశూన్యమ్ము వితథ మీ కేతనమ్ము
కన్నులింతింతలుగఁ గాంచి కాంచి మించు
విరహదహనంబునం దురపిల్లుకంటెఁ
బిల్లుకట్టుట సేమమై చెల్లుఁగాదె.

అల యెలమావిక్రొందలిరుటాకులతో, గురివెందపూలగు
త్తులపయి మూఁగు తేంట్లరొదతో, నవకేతకగంధవాహమై

కులికెడుమందవాయువులతో, కూరుచునామని రేయి యీమెయిం
గలవరపెట్టుచున్నయది కాంతునితోడివిరాళిఁ దూలు నట్.

చెలువవుకమ్మకస్తురులచిక్కనిపూఁతలమేలితావులన్
దోలఁగనిచొక్కపుంజనులతో నెఱజాణతనం బివుర్ప నే
కలికియొ శ్యామసుందరునిఁ గౌఁగిట నొక్కుచునుండు నిప్పు డా
చెలువలమిన్న మున్ను తగఁ జేసిన పున్నెమ దెట్టిదో కదా!

ఎడపక కఱి వేలుపుతో
నెడబాటను నింగలమ్ము నెదఁ దాలిచి యి
ట్లుడలుచునికి దుష్టమ్ముల
వడువునఁ గనఁబడెడి నిపుడు వలయాదికముల్.

ఆవనమాలితోడి దొక యంచుకయించుక సోల్కి శైత్యముం
భావనసేసి తాలిచినమాలికయున్ విషమస్వభావసం
భావిత మాచు బేసివిలువానిజిరావలె నేర్వఁజొచ్చెఁ గ్రొం
బూవులఁబోలు నాదుతనువున్ విషమించె జగంబె నాయెడన్.

వేతసవృక్షజాతి నొకవీసముపాటి గణింపఁబోక నే
నీకటి శూన్యకుంజమున నెక్కటి గుందుచునుంటిఁ గాని యా
వ్రేఁతలచొక్కపుంజనులపేరిమికౌఁగిళులం దలిర్చుజో
దాతఁడు నాదుజోలి నొకయించుక త్రవ్వెడువాఁడె నెమ్మదిన్?

పోయినపోఁకమై పోయెనే మరులున
ననబోఁడి నొకరిత ననుసరించి,
కూరుచుచుట్టాలు కొమరారునవకలా
కలితకేలులఁ ద్రోవఁ గట్టెయిడిరొ,
ఎడ యీనియిఱులఁ జొప్పెఱుఁగ కిట్టటు వని
నూఱక క్రుమ్మరుచున్నవాఁడొ,
అడఁగనివిరహాగ్ని నుడికినమనమున
నడు గిడ నోపక బడలినాఁడొ,

పైఁబడెనొ వేసములు వేయుపని యొకండు,
మఱి యిఁకేలకో తమి నేరుపఱచుకొన్న
మంజులమ్ము వంజులలతాకుంజమునకు
రాఁడు రాసలీలాకలారసికుఁ డతఁడు.

రాణఁ దొఱంగి గోరపువిరాళిఁ గడుంగడు వెల్లనైననా
ప్రాణఫలమ్ముబంధన మవాని మొగమ్ము మొఱుంగుపొంగులన్
రాణఁ జెలంగి వేదన నణంపఁగ నోపియు నీవిధుండు తాఁ
బ్రాణసఖుండ యౌ టసమబాణునకున్ వెతఁ గూర్చి పేర్చెడున్.

అనుచు వగర్చుచుం బ్రియునియంతికమందుననుండి వచ్చి హె
చ్చినవగఁ బల్కుకున్న చెలిఁ జెంగటఁ జూచి యవాని నన్యభా

విని నను కౌఁగిటం దనువు విస్మరియించి రహించువానిఁగా
మనమున నెంచుచుం గసినమాడికిఁ బల్కఁ దొడంగె రాధ తాన్.

పులుఁగుహులుమాయిజోదునను పోరునకుం బురుడైనవేస మి
మ్ముల సవరించి చెల్వమనమున్ వెస గ్రుచ్చిలిగొంచు సంచునన్
జలజల రాలుక్రొవ్విరులసందడి నించుక చిక్కువడ్డకొ
ప్పులఁర రమించుచున్నయది యాతనితోడ నొకర్తు కల్లదే.

పలుమఱు ముద్దుగొంచు, మునిపంటన నొక్కుచు రాగసద్రస
మ్ములయెలబావి మోవి, వలపుల్ మిపులం బురుపాయితక్రియా
కలనఁ జెలంగునాప్రచలకైశికబంగరుగిండ్లఁ దన్నుచ
న్నులపయి నాడుచున్నవి మనోజ్ఞము లానవతారహారముల్.

చెలఁగి తచ్చనలాడునలకల నెడనెడ
మొగముచంద్రుఁడు దోబూచు లాడ,
మోవిపానక మానుపూనికిమురువున
మూఁతలు వడి కనుల్ ముద్దు లీనఁ,
జలకుండలమ్ములబలువప్రహతికి ను
న్జెక్కిళ్ళు గ్రక్కునఁ జేవురింప,
వలపున మీటినయట్టివీణియవోలె
రతనాల మొలనూలు రవళి మొఱయ,

నడుమునడలు క్రొంగ్రొత్తసోఁకడలు పోవఁ,
ప్రియునికన్నులి నగవు సిబ్బితి వలగొన,
వివిధకూజితరతికృతివిధుర యాపె
యనుభవించుచున్నది రస మతనిఁ గూడి.

వలగొని యుత్పులకాంకుర
ములు వడఁకున్ భంగభంగములు గాఁ దగ, నూ
ర్పుల మూఁతలు వడఁకనుద
మ్ముల వికసదసంగ యాపె పోలు పెలసె నదే.

ఎనఁ గొనని మారుపోరిత
మునఁ బొడమినఘర్మపూరమున సుభగతనూ
ఘన యాప్పొలఁతుక తదుర
మ్మున సోలుచు వ్రాలె నదిగొ పురుతరకచ యై.

చెలి! వింటే నెఱవాదిదంట యపునాశ్రీలోలుచందమ్ము, వాఁ
డల కాళిందిదరిన్ రమించు చోకలోలాపాంగినిం గూడి య
ప్పొలఁతిం గౌఁగిట గ్రుచ్చి నిండఁ బులకల్ పూర్ణేందునం దిట్ట
ట్టులు నెమ్మోమునఁ గమ్మకస్తురితో బొట్టుం దిద్దుచున్నాఁ డదే.

అరవిందాయతపత్రనేత్ర! కనితే, యావాఁడు క్రొక్కార్మొయి
ళ్ళరకంబుం బురుడించి, చూపులన పల్మారొక్కెడెగాంద్రన్ భ్రమ

కరులం జల్పెడునాపిమేల్తుఱుములోఁ గై సేయుగోరింటపూ
వు రతీశానమృగాటవిం జపలసొంపుం బెంపు డం బీనెడున్.

మృగమదకాంతిరూపితతమేదురమున్ నఖరక్షతార్ధరు
జ్మృగధరభూషితమ్ము మణిమేఖల యాచెలిచన్నుదోయినా
గగనతలమ్మునం దతఁడు కల్కి-రో! ముత్తైపుదండ లన్నమే
ల్మిగనిగ నొప్పుతారకల నేర్పునఁ గూర్చుచునున్నవాఁ డదే.

తవునలవుం గడించికొని తామరతూఁడుల జాడుబేడు నా,
మివిలినశీతవృత్తి సుతిమెత్తనివౌ నఱచేతులన్నత
మ్మివిరులరేకులొప్పు మిసిమించుతదీయభుజద్వయిన్ మనో
ధవుఁ డదె సేర్చెఁ దా మరకతప్రియకంకణభృంగసంఘమున్.

అరసితె కల్కి-! వాఁడు విపులాపఘనస్ఫురణమ్ము చిత్రభూ
వరకనకాసనమ్ము కృతవాసనమున్ ఘనమున్ మనోజ్ఞమై
నరతిసికేతనోరుజఘనమ్మునఁ దోరణశోభ నవ్వసుం
దరతరనూత్నరత్నరసనమ్మును వైచుచు నున్నవాఁ డొగిన్.

రమణీయమ్ము రమాకరమ్ము నఖరప్రఖ్యాతమాణిక్యక్ల
ప్తి మహాశోభము చిత్రయోజితము తత్సీమంతినీస్తోమర
త్నముపాద మ్మనుపల్లవమ్మున యశోదాసూతి పైపూఁతగా
రమణీ! దిద్దుచు నున్నవాఁడు కౌమరారన్ యావకాలంకృతిన్.

హాలధరు కూర్పుతమ్ముఁ డటు లాహరిణేక్షణఁ గూడి పూర్వపు
మ్ములదారపోరునం దుఱక మున్కలు వెట్టుచు నావిచారముం
దలఁపున కెక్కనీనితలఁ దవ్వరో! యిప్పుడరింట నాఁటి ని
ట్టులు పడి కుంద నేటికిఁ గడుంగడు నే నఫలప్రయాసనై?

వలపు తలకు మిగుల వల్లవపల్లవా
ధరలఁ గూడిమాడి తనరువానిఁ
బాలఁతి! నమ్మి నానఁబోసికొని యిటు లి
చోట వందుచునికి సుద్దతప్పు.

శఠగోప మిడి నాకు శఠుఁ డయి చన్నట్రో
వన వచ్చుపరువున వాఁడు లేఁడు,
మానినీ! దోదూయమానమానసవు నీ
కుఱలింప నేల నీ రుఱక కనులఁ!
క్రీడించుఁగా వాఁడు చేడెలు వేవుర
తోడ నేటికి భవద్దూషణమ్ము?
మునుకొని తలకు మీఱినమహోత్కంఠార్తి
భారమ్మునవోలె బ్రద్దలైన

నామన మ్మవానినవగుణగణసమా
కృష్యమాణ మవుచు గిరికొనినత

దంగసంగవాంఛ యతిశయితమ్ముగా
నిపుడ యేఁగుఁ గంటె యిగురుబోఁడి !

చెలి ! మలయానిలతరళకు
వలయనయనుఁ డతఁడు తోడుపడ రసరసధిఁ
లలిఁ దెప్పలఁ దేలిన చెలి
తలిరుల సెజ్జం దపించుతగవుం గొనునే ?

విరితామరపూపొలుపుం
బురుడించు మొగమ్ము వానిఁ బాదలినతమిఁ బే
రురమున సమముముదితమొయి
గురి గాఁబో దలరువిలుతుకోలల కెపుడేఁ.

కొంకక యమృతపుజల్లుల
తెంకియ యయి తాప మార్చుతీయనిపలుకుం
బొంకమ్ము ప్రోఁడఁ గూడును
భంకరి కనదు మలయజపవనదాహమ్మునఁ.

అలికచ ! స్థలారవిందము
చెలువమ్మునఁ నవ్వ్యకాలు సేతులఁ దవున
వ్వాలఁతిఁ గవగూడుపొలఁతుక
సొలయుచుఁ దా వెన్నెలన్న సొదఁ బడదుగదా.

ముదితా ! కాఱుమొయిళ్ళం
బద పద మనుమేలిమేనివానికప్పుంగిం
టఁ దనరుపైదలియెద యద
వదన్నై విరహార్తి వ్రయ్యవ్రయ్యల యవునే ?

ఎపుడుం బుచ్చదు నిట్టూ
ర్పు పదార్వన్నెపసిఁడితులఁ బొలుచువలువఁ దా
లుపు కటివేలుపుమేల్నె
య్యపుసిరి గలచెలి చెలులెడ నాఁఱడిఁ బడుచున్.

పడదు ప్రిదిలి బీ సై త్తిన
యెడఁద విరహదహనమున సహీనను సుజ నె
న్నఁ డఖిలలోకజనమ్ముల
నడుమఁ దరుణుఁ డతనిఁ గవయుఁగలినాక్షి సఖీ !

అచ్చపలనేత్ర యిమ్మెయిఁ
బుచ్చి యొకరవంత యూసు ముమ్మరమా న
మ్మచ్చెముసిడెమ్ము దొర వెత
నొచ్చి కదున్ మలయపవను నూల్కొని తెగడెన్.

అలరులవింటితుంటరికి నంటిననే స్త్రివి నీవు చందనా
నిల ! విడనాడుమయ్య మది నెక్కొన నక్కటికమ్ము వామతా

కలనము; ప్రాణమాదువు జగమ్ముల, కిమ్ముల దక్షిణా! ప్రియుఁ
నిలుపుము ప్రోల, లేనియెడ నిల్వున నాయుసులుఁ హరింపవే.

ఏవాని మది నించు కెంచినమాత్ర శ
త్రుత నొంచెఁ జెలిపిండుతోడిపొత్తు,
ఏరసోల్లాసు భావించినంతన యంగ
ములు నేర్చెఁ జిచ్చయి మలయపవనుఁ,
డేకటివేల్పు ధ్యానించుతే తడవుగ
విసపుపాతర యయ్యె వెన్నెలదొర,
ఏవానియూసు గ్రహించుపాటన సొద
హరువొందెఁ గ్రొందలిరాకుసెజ్జ,

ఆదయాశూన్యుఁ డవ్వల్లవాంగనావి
లోలునంద నాడెందము చాల పొదు
కొనుచున్నది, చెలి! నిరంకుశుఁడు కాముఁ
డు నెలఁతలయెడ వామతాఘనుఁడు కాదె.

ఓమలయానిలా! విడువ నొప్పదు నన్నడఁగింపు; పంచబా
ణా! మొగిఁ బ్రాణముల్ గొను; మనాథము గీమున కింకఁ బోవ నే;
నేమమునం గృతాంతభగినీ! చన దోరిమి, ముంపుమమ్మ శీ
తామలవారిపూరమున నంగము లాఱఁగ దేహదాహముల్.

## విలక్షలక్ష్మీపతి

అని యింతిం తనరాని కంతువెతచే నాక్రాంతమై స్వాంత మొ
య్యనఁ జీకాకయి చిక్కు చీదరయి తాపావేశముం జెంది కుం
ద నిశాశేషము నెట్టులో గడపి రాధాసాధ్వి యవ్వేళ సా
నునయాలాపుఁ గృతప్రణాము ననుఁ గృష్ణుం గాంచి సాసూయయై.

పలుకంబోకుము కైతవోక్తులు, భవత్పాండిత్య మెల్లన్ వితా
జలుపం జూతు వి దేల? మేలురా! నమస్కారప్రకారమ్ము, పే
రలవున్ మీఱె వినమ్రతాకలన మాహా! పొమ్ము నీతాప మా
వలకొత్తుం గల యావధూటిదరికిన్ వైళంబ శ్రీవల్లభా!

నిసి యెల్లం గనుకంగఁబోవమిఁ గడుం దీపించు రాగమ్ము క్రొ
మ్మిసిమిన్ సారె నలంతిమూఁత వడునీమేల్గన్ను కెందమ్మిదో
యి సఖా! చెప్పక చెప్పెడున్ వలపు దీండ్రింపన్ దముల్ వెంచి యొ
క్క సరోజాననకౌఁగిటం దవినచొక్కాటమ్ము గాటమ్ముగాన్.

(సశేషము)